సం॥ం చందా రు 1-0-0 (పోస్టేజితో సహా) Reg. No. M. 3766

సంపుటము 33 సంచిక 1

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

## ఏప్రిల్ 1944

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు.

ప్రొప్రయిటర్లు:

రామా అండ్ కో.,

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక



# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

**ANDHRA RASTRA PRARAMBHA VIDYA**

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 33 | ఏలూరు, 15 ఏప్రిల్ | సంచిక 1 |
| --- | --- | --- |




## నిత్యసంకీర్తనము

**వివరణము :**

తన భావముల ఆధ్యాత్మికజీవితము ననుష్ఠింపలేనివా రెవ్వరునుండరు. ప్రతివారును అట్లొనర్పఁగలరు. దానికంతటికిని గావలసినది సామాన్యత, సరళత, ఉన్నతాదర్శమునందలి సత్యదీక్ష. ఒకదానిని మనము విశ్వసించుటా, విశ్వసింపకపోవుటా, యనునది వేఱువిషయము. జీవితమంతయు యోగ్యముగ నియమముల ననుష్ఠించుటలోనే కలదు.

**సంకీర్తనము :**

1. సర్వరక్షకుడవగు నీయందే నా సమస్తభారమును గలదు.
2. నీవే నా సర్వస్వము. నాధనము. నా జనము.
3. సర్వేశ్వరా! నా సమస్తము నీ కెట్లర్పింపవలెనో నా కెఱిగింపుము.

—స్వామి రామతీర్థ.

# భగవన్నుతి

కల్లూరి అహోబలరావు

(వెనుకటి సంచిక తరువాయి)

సీ. స్వర్గమహాలోక, జన, తపో, సత్య, యూర్ధ్వాదిలోకంబుల వరుస లెచట
నున్నవొ? యవ్వాని నూహింపసాధ్యమె మాబోటివారికి మహానుభావ!
అతల, వితల, సుతల, తలాతలము, రసాతల, మహాతలము, పాతాళమంచు
క్రిందిలోకము లేడు పొందికఁ జెప్పిరి చూచి వచ్చినవారి చొప్పు లెచట?
గీ. అవియు గోళంబులే కావె? యహరహంబు తిరుగుచుండంగఁబోలు నో దేవదేవ!
నీదు చిద్విలాసముల వర్ణింపఁ దరమె? భక్తమందార! నీ కిదే వందనంబు! ౧౯
సీ. ఉందురే జీవు లాయూర్ధ్వలోకములందు? మనుచున్నవారొకో మనుజు లచట?
తాపసు లుందురే తపసిలోకమునందు? జన భువర్లోక విచారమేమి?
పాతాళలోకాధిపతిగాఁగ శేషుండు మన్ననతో నుతనున్నవాఁడె?
కిన్నర గంధర్వ కింపురుషాదు లేయేచోట్లలో వసియించినారొ?
గీ. అతల, వితల లోకంబుల నడగియున్న జీవరాసుల జిత్రముల్ చెప్పి మాకు
కొంత విజ్ఞానసంపదఁ గూర్పవయ్య! భక్తమందార! నీ కిదే వందనంబు! ౨౦
సీ. కాలక్రమంబుగాఁ గమలాప్తుఁ బుట్టించి మునిగింపఁ జేసెడి మూర్తివీవు!
చంద్రునిగతి దిద్ది చంద్రికఁ గురిపించి చల్లదనం బిచ్చు చతురుఁడీవు!
అంబోధరంబు నీహద్దుపద్దులఁ బెట్టి పాలించునట్టి క్ష్మాపాలుఁ డీవు!
మతిఁదప్పి పీవక హితముగా వాయువు వీవంగ శిక్షించు విజ్ఞుఁడీవు
గీ. అహహ! నీ కార్యదీక్ష యత్యంతశిక్ష రక్షణాపేక్ష సతము ప్రత్యక్షమయ్యె!
అక్షరప్రేమఁ జూపెడి దక్షుఁ డీవు! భక్తమందార! కిదే వందనంబు! ౨౧

---

# చిద్విలాసము

(బాలబాలికల యుపయోగార్థము వ్రాయఁబడిన చిన్న నాటిక)

రచయిత: కోడాలి దామోదరయ్య - అంగలూరు.

(ఫిబ్రవరి సంచిక తరువాయి)

## 3 వ రంగము

(స్థలము-పల్లెబడి బాలురు గల్లంతు చేయుచుందురు. ఉపాధ్యాయుడు ప్రవేశము అందఱులేచికూర్చుందురు)

ఉపా:—డిక్టేషన్ వ్రాయండి ఒక యూరిలో ఉ రేయ్ రాముడూ, నిన్నమీ తాతమ్మతో మాట్లాడే పిల్లకాయ యెవరురా?

రాముడు?—మా పిన్నండీ

ఉపా?—ఊ! సోమయ్యయను బాలుడు కలడు: ఏమివ్రాశావో చదువురంగా!

రంగ.——ఒక యూరిలో - ఊరేగ్ రామాయణ్మా, నిన్న మీ తాతమ్మతో మాట్లాడే మనిషి యెవరురా? సోమయ్య యను బాలుగుకలడు

(బాలురందఱు పకపకనగుదురు.)

ఉ:——ఔరా, రా, వెనక బెంచీలో మాట్లాడుచుండగా ప్రశ్నలా? (అని రెండు చెంపకాయలు వేయును)

బా.——మాష్టారండీ మాయమ్మ ఒక లెక్క వేసింది, చెప్పరండి?

ఉపా:——ఏమిటది ?

బా:——2 గుఱ్ఱములకు కొమ్ము లెన్నండీ ?

ఉపా'——రెండు రెండ్లు నాలుగు కాదురా ?

2 బా:——మాష్టారండీ ? (నవ్వును)

ఉపా'——(కోపముతో) ఏమిటిరా ?

2 బా:——ఎక్కడన్నా గుఱ్ఱానికి కొమ్ములుంటాయండీ అసలు ?

ఉపా:——కనిపెట్టేవురా మొత్తానికి మీసరుకు తెలిసికొందామని చూచాను. (అందఱు నవ్వుదురు)

3 బా:——మా అక్కయ్య ఒక ప్రశ్న వేసిందండి ?

ఉ:——ఏమిటది ?

3 బా:——రామయ్యగారి కోడిపుంజు వెంకయ్యగారి దొడ్లో గ్రుడ్డు పెట్టెను. ఆగ్రుడ్డు ఎవరికి చెందవలెను ?

ఉపా:——(ఆలోచించి) దొడ్డి వెంకయ్యది గనుక అతడే తీసికోనును.

4 బా:——ఎక్కడన్నా కోడిపుంజు గ్రుడ్డు పెడుతుందా అండీ? బలే హిహి హిహి!

(బాలురందరు నవ్వుదురు)

ఉపా:——భేష్ ! నీవు తెలివిగలవాడవురా !, అబ్బాయిలు గల్లంతుచెయ్యకండి ఇనిస్పెక్టరుగారు వస్తున్నారు.

ఇనస్పెక్టరు ప్రవేశము ఉపాధ్యాయుడు లేచి నమస్కరించును బాలురందఱును లేచి కూర్చొందురు

ఇన్:——నీ కొక కథ జెప్పుతాను.

1 బా.——ఒక ఊరిలో ఒక అడవి యుండదండీ ఆ అడవిలో ఒక తోడేలు ఉందండీ.

ఇన్:——అడవి అంటే ఏమిటిరా అబ్బాయి

5 బా:——నాతలకాయండీ.

(అందఱునగుదురు)

ఇన్:——ఏమిటి మాష్టారూ? ఈసమాధానం ఏమిటి ?

ఉపా:——ఆ ! ఏమిలేదండీ అరణ్యము లోనిచెట్లు తలలోని వెంట్రుకలవలెనుండు నని చెప్పితిని

ఇన్:——భూమి అంటే ఏమిటిరా ?

3 బా:——భూగోళములోనా ? చరిత్ర లోనా? మీరడిగేది ?

ఇన్:——(తనలో) ఇదేమిటి? భూమి భూగోళపాఠములో నొక విధముగను, చరిత్ర పాఠములో మరియొక విధముగను, ఉండునని పిడికిచెప్పిరి కాబోలు (ప్రకాముగా) రెంటిలోను చెప్పు.

3 బా:——భూగోళములో భూమిఅంటే మా మాష్టారి పొడుముకాయ చరిత్రలో భూమిఅంటే మా మాష్టారి అబ్బాయి బుఱ్ఱకాయి

అందఱు నవ్వుదురు)

ఇన్:——(నవ్వి) ఇదేమిటి పంతులుగారూ?

ఉపా:——కుఱ్ఱవెధవలండీ ? ఒకనాడు భూగోళము పాఠము చెపుతూ భూమిఆకా

రము. పోషింపకాయువలెనుండునని చెప్పితిని ఇంగ్లీషు దినసులన పరిత్రపారము చెప్పుచు అచ్చటనే మా చిన్న బ్బాయి కూర్చుండుట చేత, వాని తలవలె భూమియుండునని చెప్పితిని:

ఇన్:—చాలులే చదువు మాబాగా నేర్పినారు. గ్రాంటులు తేరగా లేవుకుర్చీలో కూర్చొని హాయిగా పరుండిన లాభమేమి? తే ఇన్‌స్పెక్షను బుక్కు.

ఉపా:—(ఇన్‌స్పెక్షను బుక్కు తెచ్చి యిచ్చును)

ఇ:—(త్వరగా రిమార్కు వ్రాసి నిష్క్రమించును.)

ఉపా:—ఇంక యిండ్లకు పోండిగా? (కుర్చీలో కూర్చొని రిమార్కు ఇట్లు చదువును) వసతిచాలదు. ఉపకరణములు లేవు ఉపాధ్యాయుడు వృద్ధుడగుటచేత సమర్థత లేదు. రిజిష్టర్లు లేవు. విద్య చాలతక్కువ. క్రమశిక్షణసున్న. మొత్తముమీద పూర్తి అసంతృప్తి. (అని చదివి పుస్తకముక్రింద పడవైచి)

(తనలో) ఇంకేముంది ఇకగ్రాంటు రాదు. కష్టమునకు ఫలితముసున్న. గ్రాంటు ...రా...దు. గ్రాం...టు...రా...దు.

ఇంటివద్ద దాని గోడుపడలేకున్నాను. బడిలో పిల్లల గల్లంతు నాపలేకున్నాను. ఇట యీయనగారు ఇట్లు తిప్పలు పెట్టు చున్నారు. కటకటా! ఏమివృత్తి? గౌరవ మర్యాదలా నశించెను. అధికారమా శూన్యము. రాబడియా సున్న. వెట్టిమిన్న ఎన్నితిప్పలు పడినను ఎంత చదువుచెప్పి నను, లాభమిసుమంత కానరాదు. ఎచ్చట నైన నాలుగు పద్దులువ్రాసియైన సుఖముగా జీవించవచ్చును. హా! హతవిధీ! దీనరక్షకా!

సీ॥ పదిరాళ్ళ యిడుములు పడినప్పటికినైన
చేతికిరాదురా చిల్లిగవ్వ
అన్నపానంబులు మానినప్పటికినైన
ఆవంతదయరాద యధిపతులకు
చేయరానిపనులు చేసినప్పటికిని
ప్రాపుదొరకబోదు ప్రజలనుండి
పశువరానివెతలు పడినప్పటికిని
సాగ దీసంపోరు గౌరవంబు
గీ॥ తీరుబడిలేదు చిక్కనితీరు లేదు
రాబడియటన్న కానైనరాదు బాబు!
కాపురంబొనర్చుటకేని కానరాదు
పల్లెబడియొజ్జ చేసినపాప మేమొ!

అయినను ఈ వృత్తివలన కొంత దేశ సేవచేయుటకు వీలుగానున్నది. ఇప్పు డిప్పుడు ఈవృత్తిలోనికి బాగుగా చదువు కొని సమర్థులగు యువకులు ప్రవేశించు చున్నారు. ఎట్టి తిప్పలుండవు. వారి పరువు గమనించి, అధికారులసైతము వారిని ఆదర మర్యాదలతో చూచు చుందురు. వారు సర్వస్వాతంత్రతాభిలాషులు. వారి విధిని మాత్రము తు, చ, తప్పక యొనర్చు కొందురే కాని, పరాధీనులుకారు. దేశ మును పైకి తేవలెనన్న అట్టి యుపాధ్యా యులే ముఖ్యావశ్యకము. ఇంతకు ఆ భాగ్యము నాకులేదు. నా కర్మము. (నిష్క్రమణము)

(తెఱవాలును)

## 4 వ రంగము

(స్థలము-తాయారమ్మ గృహము-ఒంటరిగా కూర్చుండి యుండును.)

తాయా:—(తనలో) ఆహా! కాల మహిమ? ఎందుచూచినను మార్పులే జరుగుచున్నవి. కాలము మారినది. స్త్రీలు భర్తల పలుకులు జవదాటుచున్నారు. అన్నట్లు మఱచితిని. నేడు నా బాల్య

స్నేహితురాలు విమలావతమ్మ బొంబాయి నుండి వచ్చెను. అది స్కూల్ ఫైనల్ ప్యాసయిందంట. రాలుగాయి ఆసలే స్త్రీలకు చదువేమిటి? నడుమంతరాలు ఆ స్త్రీలలో తిరుగుట, పరపురుషులతో మాట్లాడుట, నాగరికతట! నాగరికత!

విమలావతమ్మ:—(ప్రవేశించును)

తాయా:— ఎప్పుడొచ్చావే? మీ యింటికి బయలు దేరబోతున్నాను.

విమ:—ఇప్పుడే ఒక గంట యింది మెయిలుదిగి. అంతా క్షేమమా?

తాయా:—ఆ! సరేకాని నీలో చాలా మార్పువచ్చిందే. ఏమిటా వేషం? బోగం దానిలా తయారయ్యావు?

విమ:—(నవ్వుతు) ఏమిటక్కయ్యా! ఆలాఅంటావు.?

తా:—లేకపోతే ఆ గౌనేమిటి? ఆ బూట్లేమిటి?

విమ:—చదువుకొన్నవాళ్లు ఇలాగే యుండవలయును. ఇలా లేకపోయిన గ్రామాంతరము లేగిన గౌరవమర్యాదలుండవు.

తా:—అసలు నీవు గ్రామాంతరమేల పోవలెను.

విమ:—అక్కా! నీవింకా అజ్ఞానములోనున్నావు. ఏం? స్త్రీలు ఎందుకు తిరుగరాదు? వారికి పురుషులపాటి స్వాతంత్ర్యము ఎందుకు లేదూ? స్త్రీలు మానవులు కారూ! వారికి లోకజ్ఞాన మనవసరమా? వారికి సంఘముతో పనిలేదా? విషయములు గ్రహించవలసిన యగత్యము లేదా? ఎల్లప్పుడు మగవారికి దాసోహము చేసి, తావసించునదె స్వర్గమంచు, తమ లోటిదే లోకమంచు, బావియందలి మండూకములవలె చావవలసినదేనా? స్త్రీకి విద్యలో స్థానము లేదా?

తా:—అవును. నీవు చెప్పినది నిజమే గాని, ఈ రోజుల్లో మనవారు అంగీకరించరు

(తాయారమ్మతల్లి మంగమ్మ ప్రవేశము)

మంగ: —విమలావతమ్మా! చాల్లే నీ యుపన్యాసం. ఈరోజుల్లో ఎక్కడైనా సరే చూడు. ఫలాని వారిపిల్ల చక్కగా ఇతరుల కంటికి కన్పించక పనులన్నీ చేసుకుంటూ, యుండిన మంచిదంటారా? లేక గాడిదవలె నీతి నియమాలు లేక బజారుల్లో తిరిగితే మంచిదంటారా లోకులు?

విమలా—అబ్బా! ఈ లోకులతో మన కేల? వాళ్లనేకమనుకొంటారు వాళ్లకు విషయజ్ఞానము తెలిస్తేగా? స్త్రీయనగానేమిటో, స్త్రీ హక్కులేమిటో, వారికి తెలిస్తేగదా!

(రంగమ్మ, శేషమ్మ, జగ్గమ్మ, డాక్టరు కమల ప్రవేశము)

రంగ:—విమలావతమ్మా. చాలమారి పోయావు. ఏమిటో ముఖానికి పూశావు తెల్లగా నాటకాలు వేస్తావేమే?

శేష:-బలేగా తయారయ్యింది. ఒసేయ్. మా మేనత్తకొడుకు పెళ్ళి జరుగుతూంది. మేళానికివెళ్ళతావా? ఒకబోగంది తక్కువయ్యిందంట?

జగ్గమ్మ:—సంఘములో ఈచదువులు, ఈవేషాలు చెల్లవమ్మా! ఇది సంసారపద్ధతి గాదు. చిన్నదానవు నీకేమి తెలియును.

విమల:—(నవ్వుచు) నాకేమియుభయము లేదు. ఏమి డాక్టర్ కమలగారు. మాట్లాడరేం?

కమల:-(నవ్వుచు) చదువుకొనవచ్చును గాని దుస్తులు మనకు పనికిరావమ్మా!

జగ్గమ్మ:-ఎందుకండి స్త్రీలకు చదువు.

కమల:-ఏ. స్త్రీయొక్క యావశ్యకము మీరు గ్రహించలా. వినండి.

సీ. కాంత లేనిలోకము తను కాంతిలేదు
యువిదలేక స్నేహ్నాటియూరు లేదు
గృహిణిలేక వాసిగనిన గృహము లేదు
లలన మహిమ మెఱుంగుకో లలనలారా!

శేషమ్మ:— బాగుగనే యున్నదండి. మఱి స్త్రీలు మగవారికి దాస్యము చేయవద్దా?

విమల:—తన విధిమాత్రమే చెల్లించుకొనవలెనుగాని, తన స్వేచ్ఛనేల చంపుకొనవలెను?

గీ మగనికేలను మగువపై మమతలేదు
భార్యనేలను మగనిపై భక్తియుండు!
దార యున్న పురుషులకు దాసిగాదు
యువిదకేలను మగవాని యుక్తిలేదు.

కాన భార్యపై మమతలేని పురుషులకు సతి బానిసగానుండ నగత్యము లేదు. డాక్టరుగారూ దుస్తులలో మీ యభిప్రాయమేమండీ?

కమల:—అబ్బే. ఏమీ లేదు. ప్రతిస్త్రీయు భారతమాతస్వాతంత్ర్యమునకే పాటుపడవలెను. అట్టిచో బాగుగా విద్య నభ్యసింపనగునుగాని పాశ్చాత్య పద్ధతులకు మాత్రము లొంగరాదు. మన దేశపు నియమములనే పాటించి మన దేశ ప్రేమను, ప్రజానీకమునకు వెల్లడించవలెను.

నేనొకసారి రోమునగరము సందర్శించుటకు పోయినపుడు భారతదేశ దుస్తులతోనే తిరుగుచుంటిని. అచ్చటి నాగరికురాలొకర్తె నన్ను చూచి, పకపక నగి, "సోదరీ! నీవు రోములో నుంటివిగాని, ఇండియాలో లేవు. రోములోనున్నపుడు ప్రాగ్దేశీక స్త్రీలవలెనుండుట మంచిది" యని సలహానిచ్చెను. వెంటనే నేను కోపముతో 'మీరు మా దేశమునకు వచ్చినపుడు మావలె నుండుట లేదే?' యనియడుగ నామె నిరుత్తరయయ్యెను. తెలిసినదా?

విమల:—ఆ. బాగుగా గ్రహించితిని. ఇటుపై నీ దుస్తుల మార్చుకొందును.

రంగమ్మ.—ఇంతకీ తేలిందేమిటి?

శేషమ్మ:—ఏముంది? స్త్రీలు దేశసేవకై, జ్ఞానోపార్జనకై, విద్య నభ్యసించవచ్చునుగాని, దుస్తులు మాత్రము మనకువలెనే ధరించవలెను.

రంగ:—మంచిది. ఇక పదండి.

(అందఱు నిష్క్రమింతురు.

(తెఱవ్రాలును.)

సంపూర్ణము

N. B ఈ నాటకము నేను గుడివాడతాలూకా కొమరవోలు గ్రామము ఎలిమెంటరీ స్కూలులో ప్రధానోపాధ్యాయుడుగా పనిచేయుచు, బాలురచే ప్రదర్శింపజేసి జయమొందితిని మీరును ప్రకటించి జయమొందుడు.

—కోడాలి దామోదరయ్య.

---

## పాఠశాలల క్రమశిక్షణము

### ఆచార్య శ్రీమామిడిపూడి వెంకటరంగయ్యగారు

* * *

(సత్తెనపల్లి-శ్రీ శరభయ్య గుప్త హిందూ హైస్కూలు సప్తమవార్షికోత్సవము ది 14-3-1944 తేదీన జరిగినది. ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన శ్రీ లక్కరాజు సుబ్బరావుగారు సభాధ్యక్షత వహించిరి. ఆచార్య శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు పైవిషయమునుగూర్చి యుపన్యసించిరి. వారి యుపన్యాస సారాంశమే యిందు వివరింపబడినది)

* * * —సంపాదకుడు.

లేదు. పోలీక నీచమైనను పాఠశాలను గూడ నిటిమహత్తరమైన యాకర్షణశక్తి యుండవలెను. ఇది యున్నప్పుడు విద్యార్థు లనాకర్షణ చిత్తులుగాఁ జాలరు.

ఈ యాకర్షణశక్తి నేటి పాఠశాలలకులేదు. విద్యార్థులకు పాఠశాల పరమావధి యగుటలేదు. వారి యభిరుచులకు, జీవితములకు, అది యుపయోగపడుటలేదు. వారి యుత్సాహశక్తులను, అది యినుమడింపఁజేయుటలేదు. ప్రస్తుతము ఉపాధ్యాయులు తమ విధానమును మార్చుకోవలెను. విద్యార్థులయభిరుచు లెఱింగి తదనుగుణముగా విద్యను బోధింపవలెను. వారి జీవితసౌధమునకు గట్టి పునాదులు వేయవలెను. అప్పుడుగాని క్రమశిక్షణ చక్కబడదు. క్రమశిక్షణ యనగా కొట్టుటగాదు, తిట్టుట గాదు, జరిమానాలు విధించుటగాదు, పాఠశాలనుండి బహిష్కరించుటగాదు, బర్తరుపుచేయుటగాదు. విద్యార్థుల మనస్సులను ఆకర్షింపవలెను. వారి దృక్పథమునందు పాఠశాల విస్మరింపరానిదిగా నుండునట్లు చేయవలెను. ఇట్లు చేయుటయే పాఠశాలల క్రమశిక్షణ.

నేడు పరిపాలనా విధానము చక్కగా సాగుచుండుటకు సైనికశక్తి మూలాధారముగాదు. పోలీసువారి భయమునుగాదు. ప్రజలలో న్యాయమునందు నమ్మికయున్నది. ఆనమ్మికయే సక్రమముగా నడచునట్లువారిని ఆకర్షించుచున్నది. అట్టి నమ్మికపాఠశాలలపట్ల విద్యార్థులకు కుదురుకొనవలెను. అన్నివిధముల పాఠశాల విద్యార్థుల నాకర్షింపవలెను. అప్పుడు పిల్లలు తమ యుద్దేశమును మఱువఁజాలరు. పాఠశాలవారి దృక్పథమునుండి తొలగిపోఁజాలదు.

ఇట్టి యాకర్షణప్రభావము పాఠశాలల పట్ల నేడు శూన్యమగుటకు ముఖ్యముగా మూడుకారణములున్నవి. మొదటిది అభిరుచి కొలంది విద్యగఱపఁబడకుండుట. ఒక హైస్కూలులో ఐదువందల మంది పిల్లలున్నారంటే అందఱి యభిరుచు లొకే మాదిరిగా నుండవు. ఉండఁజాలవు. కొందఱికి సారస్వత విద్యయందు అభిరుచి. కొందఱికి కార్మిక విద్యయం దభిరుచి కొందఱికి సంగీతమునందు కొందఱికి చిత్రలేఖనమునందు, కొందఱికి శిల్పమునందు ఇట్లు అభిరుచులు మారుచుండును. ఈ యభిరుచుల భిన్నత్వమును పాఠశాలలు గుర్తించుచున్నవా ? లేదు. అందఱికి ఒకేరకము విద్య. ఎక్కడికిపోయినా ఒకే రకము పాఠశాల. ఇట్టి విద్యయందు చాలమందికి నమ్మకములేదు. అభిరుచియునులేదు. విద్యార్థులు మార్గాంతరములేక చదువుచున్నారు. మనము వారిని కేవలము చిలుకపలుకులవలె చదివించుచున్నాము. విద్యార్థులలో ప్రబలుచున్న యీఅసంతృప్తియే నేటి క్రమశిక్షాభంగమునకు మూలకారణము. నేటి విద్యావిధానములోను ఉద్దేశములోను లోపమున్నది. ఆ లోపము సవరింపఁబడిననాడు క్రమశిక్షణము దాని కదియే చక్కబడఁగలదు.

రెండవకారణము నేటి పాఠశాలలలో నీతివిద్యకు తావులేకపోవుట. అనగా శీలనిర్మాణమునకు నేటి పాఠశాల తగిన దోహదమిచ్చుటలేదు. మన యభిప్రాయము చాల సంకుచితమైనది. స్కూలుయొక్క పేరు ప్రతిష్ఠలు ఒక పరీక్షాఫలితములమీద మాత్రమే ఆధారపడియున్నవని మనము తలంచుచున్నాము. అదియొక అంశము మాత్రమే. దానికి అగ్రస్థానమియ్యరాదు. విద్య నేర్పునది మన ప్రవర్తన బాగుపడుటకు ప్రవర్తనమును చక్కజేయలేని విద్య పాపిష్ఠివిద్య. ఏ మతము ప్రకారమైనను జీవితసాఫల్యము మోక్షమును సాధించుటయే యన్నట్లు ఏ విత్తు నాటినను దాని సఫలతవృక్షమగుటయే యన్నట్లు, ఏ చదువు చదివినను దాని సఫలత సత్ప్రవర్తనమును బొందుటయే. ఈ మహావిశ్వమునందు మానవుడు ఏకాకిగా లేడు. అతడు తనపట్ల తన పొరుగువానిపట్ల తనదేశముపట్ల నెరవేర్పవలసిన ధర్మములెన్నియో గలవు. ఈ ధర్మము లన్నింటిని తెలిపి, ఉత్తమ ప్రవర్తకునిగాఁ జేసి, మానవుని స్వధర్మానుష్ఠాన తత్పరునిగాఁ జేయునదియే విద్య. ఇదియే యుత్తమమైననీతి విద్య—శీల నిర్మాణవిద్య. ఇట్టి విద్య యీనాటి ప్రతి పాఠశాలలోను లేదనియే చెప్పవచ్చును. ఈ రకము విద్య నెంపొందిననాడు ఏ విద్యార్థి తన పాఠశాలను మఱచిపోయి అన్యములచే నాకర్షింపఁబడఁగలడు ?

ఇంక మూడవకారణము మానసిక తత్త్వమును గుర్తించి విద్య గఱపకపోవుట. దీనినే ఇంగ్లీషులో సైకాలజీ (Psychology) అంటారు. విద్యను బోధించుపట్ల ఇది చాలముఖ్యము. నేటి విద్యావిధానమును బట్టి పిల్లలను 5 గంటలసేపు బల్లలమీద కూర్చుండఁబెట్టి, వారిచేత నేమియుచేయించక, వయస్సునకు సరిపోయిన పనులలోఁ బాల్గొననీయక, వారి యుత్సాహశక్తిని మ్రింగదీయుచున్నాము. పోతవిగ్రహమువలెనున్న వానిని మంచిబాలుడనుచున్నాము. ఎగురులాడువానిని, కార్యోత్సాహము గలవానిని, కొంటెవాడనుచున్నాము. పిల్లలు క్షణమైనను ఊరకేయుండలేరు. వారి ఉత్సాహశక్తి మెండు. ఉపాధ్యాయుడు వారివారి యుత్సాహశక్తులను గుర్తించి, యినుమడింపఁజేసి, తగిన పనులను

కల్పించవలెను. వారి మానసిక వికాసమును పెంపొందింపవలెను. వారు సంతోషపూరితులై యున్నప్పుడే వారు చేయు పనులద్వారా వారికి విద్యగరపవలెను. ఇందుకు బాలభటోద్యమము కొంత తోడ్పడుచున్నది. ఇట్టి యుద్యమములను ఎల్లెడల నెలకొల్పి కల్పించి, వారి శక్తి వ్యక్తమగునట్టి తగిన పనులను చేయించవలెను. వారెల్లప్పుడు ఉల్లాసవంతులుగా నుండునట్లు చూడవలెను.

ఇట్టి లోపములను సవరించుకొని నేటి పాఠశాలలు ఉత్తమవిద్యకు మార్గదర్శకములుగా చేసి—తగిన కార్యమును సాధించుటకు గురువులతోపాటు ప్రజలును తోడుపడుదురేని—క్రమక్రమముగా సమస్యగా నిలిచినదియే నశింపగలదు. విద్యార్థి తానంతటను నేర్చుకొనుటకు ప్రయత్నమును నేర్చుకొనగలడు.

**సంపాదకుఁడు.**

---

## యుద్ధ ప్రచార గీతము

బాలకవి : అన్నాప్రగడ వీరరాఘవయ్య

(స్త్రీలకు విద్యలు రావా - అనువరుస)

1. సాయము సేయగలేవా - శౌర్యము జూపగరావా
   సమరాంగణమున జేరి - శత్రువులనెల్లరి జంపగ॥ సాయము॥
2. సత్యంబును విడనాడి - శాంతింబును దిగద్రొక్కి
   మారణహోమము జేసి - మాడ్చెడు శత్రుల జంపగ॥ సాయము॥
3. భారతవీరుల ప్రతిభగ - బాగుగ యోచనచేసి
   వీరత్వంబును జూపగ - వేగమె పోరికిరావా॥ సాయము॥
4. శత్రువులను నురుమాడి - స్వాతంత్ర్యము గాపాడి
   రాజుకు తోడుపడంగగ - రక్తము నీలో లేదా॥ సాయము॥

---

## పల్లెటూరి ఉపాధ్యాయుని స్థితి

మారెళ్ల వెంకటసుబ్బారావు, దవ్వూలపాడు.

ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుఁడు సాధారణముగా పల్లెటూరునందు నివసించవలసియుండును. అతనికి గ్రామమునందు పలుకుబడి యుండదు. పైగా బడిపంతులనిన ప్రతివానికి హాస్యాస్పదము. పాఠశాలకు తగు సహాయము చేయవలయునని యెవరికిని యుండదు. ఉపాధ్యాయునికి కావలసిన ప్రతి అవసరమునకు గ్రాంటుపై ఆధారపడి యుండవలయును. గ్రామములో అప్పిచ్చు వర్తకులుండరు. తనకు వచ్చు స్వల్ప వేతనముతో పలుకష్టములు పడవలసియుండును.

ఉపాధ్యాయుఁడు మొదట యీవృత్తికి వచ్చుటకు రెండు సంవత్సరములు బోధనాభ్యసన పాఠశాల (Training School) యందు కష్టించి చదివి, పరీక్ష ప్యాసు కావలెను. ప్యాసయిన తదుపరి యుద్యోగమునకై ప్రయత్నించవలెను. ఇదివరకు

తాలూకా బోర్డులున్నపుడు ట్రయినింగు ప్యాసయిన యుపాధ్యాయులు కొద్దిమంది యుండుటచే ట్రయినింగు స్కూలునుంచి రిలీవ్ కాకముందే Appointment orders స్కూలునకే వచ్చెడివి. ఫలితములు తెలియక ముందే ట్రయినింగుస్కూలునుంచి రిలీవ్ అయిన మరుదినమే యుద్యోగములో ప్రవేశించెడివారు. కాని నేడో అట్లుకాదు. ట్రయినింగునుంచి రిలీవ్ అయి పరీక్షా ఫలితములు వచ్చువరకు ఇంటివద్ద 2, 3 నెలలు వృథాగా నుండవలసి వచ్చును, తదుపరి పరీక్షయందు తీర్ణులయిన వారికి మాత్రమే యుద్యోగార్హత, అదియు జిల్లా బోర్డుస్కూలు ఉద్యోగముగాని, మునిసిపాలిటీ ఉద్యోగముగాని లభించుట కడు దుర్లభము. ఇంటివద్దనుండి జీవనము చేయుదమన్న, యీవృత్తికి పాల్పడువారు సాధారణముగా బీదవారై యుందురు. బోధనాభ్యసన పాఠశాలయందు తర్ఫీదు పొందినందుకగాను, 3 సంవత్సరముల లోగా 18 నెలలు సర్వీసు పూర్తిచేసి, సర్టిఫికెటునుకట్టిటుచేయించుకొనవలెను, అందులకై పరీక్షా ఫలితములు తెలిసిన తదుపరి ఉద్యోగము నన్వేషించుటకై బయలుదేరవలెను.

ఇక వీరికి లభించునవి గ్రాంటుస్కూళ్లు. పంతులు ప్రతి గ్రామమునకు వెళ్ళి ఆ గ్రామమునందు గ్రాంటుబడి యున్నదో లేదో కనుగొని, యున్నయెడల ఆస్కూలు మానేజరుగారిని దర్శించవలెను. వారితో మాట్లాడగా అక్కడ ఖాళీయుండక పోవచ్చును. అథవా ఖాళీయున్నను "మాకు 15% of the grantయిచ్చెదరా?" అని యడిగెదరు. సాధారణముగా పల్లెటూళ్లలో గల పాఠశాలలన్నియు నేడో కొన్ని లోపములతో నిండి యుండును. ఈ లోపములకు పై అధికారులు కొంతకోతను (cut) ప్రసాదించెదరు. ఇన్ని లోపములు గల పాఠశాలయైనను మానేజరుగారి యిష్టప్రకారము చేసక తప్పదు. ఉపాధ్యాయునకు మానేజరుగారికిని, హెడ్మాష్టరుగారికిని, విధేయుడై, తన పనులను సక్రమముగా నిర్వర్తింపవలెను. కొంతమంది మానేజర్లు ఉపాధ్యాయులను యేలాగో కడు నీచముగా చూచెదరు. మానేజర్లు కూడా ఉపాధ్యాయుల మాదిరిగానే ట్రయినింగుప్యాసయియుందురు. అయినను వారుతమసోదరోపాధ్యాయులయెడచూపెడి నిరాదరణకు కారణమేమో తెలియదు. ఉపాధ్యాయుడు తన తరగతి పిల్లలనైనను ప్రతిరోజు ఇంటింటికి తిరిగి పిలుచుకొనవలసి యుండును. అటుల చేయుచున్నను, పిల్లల తల్లిదండ్రులు తమ పిల్లలకేవియో పనులు నియమించి, వారిని పొలములకు పశువులను కాయుటకు, పంపుచుందురు. అందువలన అకస్మాత్తు తనిఖీలయందు (Surprise visits) హాజరు తగ్గవచ్చును. అటుల తగ్గుటవలన (శ్రీ) యినస్పెక్టరుగారు కొంత కోతను ప్రసాదించెదరు. మానేజర్లును, ఉపాధ్యాయులును, కడుంగడు మైత్రితో మెలంగిన, అట్టిస్కూలునందు పనిచేయుటకు ఉపాధ్యాయులకు త్సాహము మెండుగా నుండును. తదనుగుణ్యముగా పరీక్షాఫలితములు బాగుండును. ఎంత కష్టించి విద్యగరపినను కొన్ని కారణముల వల్ల ప్రాథమికోపాధ్యాయుడు వన్నెకెక్కకుండ నున్నాడు. 1. ఇనస్పెక్టర్లకు తగు మర్యాదలు చేయకపోవుట, 2. కష్టించి

విద్య గరపినను, ఇతన్స్వకర్తవ్యదృష్టికి న[illegible] గదా యుండుట, 3. మా[illegible] టీచ ర్లకు గల కలహములు, 4. గ్రామములలో పలుకుబడి లేకుండా యుండుట, 5. విద్యార్థుల తల్లిదండ్రులు తమపిల్లలను సక్రమముగా బడికి పంపకుండుట. కనుక ప్రాథమిక పాఠశాలలు బాగుపడవలెనన్న యీ క్రింది సూచనలను మేనేజర్లును, టీచర్లును, గ్రహింపనగును.

1. టీచర్లు, మానేజర్లు, సఖ్యముగా నుండి, తమ స్కూలుపనులను సక్రమముగా ఎట్టికలహములు లేకుండా నిర్వర్తించుకొనవలెను. 2. మానేజర్లు స్కూలుకు వచ్చెడి గ్రాంటును (Assigned grant) టీచర్లకు యివ్వవలెను. అందువలన సమానత్వమేర్పడను అనగా ఇందువలన ప్రతియుపాధ్యాయుడు కష్టించిపనిచేసి. అభివృద్ధి వేతనము (Increment) పొందవలెనని ప్రయత్నించును. అట్లు వచ్చిన గ్రాంటును (Increment) తో సహాయుపాధ్యాయులకు యివ్వవలెను. పాఠశాలా నిర్వహణమున కయ్యెడుఖర్చులు ఉపాధ్యాయులందరు సమానముగా భరించవలెను. 3 గ్రామమునందు పలుకుబడి సంపాదించవలెను. విద్యార్థుల తల్లిదండ్రులతోను, గ్రామస్థులతోను, సఖ్యముగా నుండి పోషకసంఘ సభలనేర్పాటుచేసి, అట్టి సభలందు వారుమాట్లాడునట్లుచేసి వారిచే కావలసిన యావత్తు సహాయమును పొందవలెను. 4. పాఠశాలకు వచ్చెడి గ్రాంటుగాక, యితరాదాయములను మానేజర్లును, టీచర్లును, సమానముగా పంచుకొనవలయును.

ఉపాధ్యాయులు [illegible] నివేదించుటకై తాలూకాలోక ప్రాథమికోపాధ్యాయసంఘమును Taluk Elementary School Teachers' Association స్థాపించి అందు ప్రతియుపాధ్యాయుడును సభ్యుడుగా చేరవలెను. నేడున్నటీచరు మానేజర్లసంఘమువలె తాలూకా యుపాధ్యాయసంఘమును రిజష్టరుచేయించి, ఆసంఘము ద్వారా మనకష్టములను పైఅధికారులకు నివేదించి, తగిన సదుపాయములను పొందవచ్చును. "కృషితో నాస్తిదుర్భిక్షమ్" అన్నట్లుయేపనియైనను ఐకమత్యముతో సంఘముద్వారా ప్రయత్నించిన సఫలము కాగలదు. మనకవ్వబడెడి జీతము బహు స్వల్పము. అందులో పైయధికారుల కోతలుపోగా మిగిలిన దానిలో మానేజర్ల కోత ఇవియన్నియు పోగా నుపాధ్యాయునికి లభించు వేతనము చాల స్వల్పము ఈ స్వల్పవేతనముతో గ్రాంటు పాఠశాలోపాధ్యాయుడు తన దారపుత్రాదులను పోషించవలసియుండును. ఒకపూట నిండు రెండవపూటకున్ను అదియుండగాక నేడు యుద్ధమువల్ల ప్రతివస్తువునకు ధరలు పూర్వముకన్న 3 రెట్లులేక 4 రెట్లు హెచ్చుగా పెరిగినవి.కనుక ప్రతితాలూకాకును ఉపాధ్యాయ సంఘమును స్థాపించి, అందు ప్రతియుపాధ్యాయుడు సభ్యుడుగాచేరి, మనకష్టములను పైఅధికారులకు నివేదించి, సఫలీకృత మనోరథులగుదురని నమ్ముచున్నాను.

# భూగోళ ప్రశ్నోత్తరములు.

## 6 వ తరగతి

by

తాతా జగన్నాథరావు, హెడ్మాష్టరు శో[illegible]ర్యాం.

(1944 సం॥రం మార్చినెల తరువాయి)



**Syllabus Heading —III-a 6. B. కాంగోప్రజలు.**

81. కాంగోనది యే ఖండములో నున్నది ?

జ:—కాంగోనది ఆఫ్రికాఖండములో నున్నది.

82. కాంగోనది మైదానమందలి అడవులెట్టివి ? అందులకు గల కారణమేమి ?

జ:—కాంగోనదీ ప్రదేశమ్మున దట్టమైన అడవులు గలవు. దీనిలో కొంతభాగమున ఎత్తగు గడ్డిదుబ్బులు గలవు. ఇందులకు అధికవర్షము, వేడిమియు కారణములు.

83. కాంగోనదీ మైదానమందలి అడవులలో నేయే జంతువులు గలవు ?

జ.—ఇందు ఏనుగులు, దున్నలు, కోతులు, పశువులను పట్టిచంపెడి యీగలును, చలిజ్వరము కల్గించు దోమలును, విస్తారముగ నుండును.

84. అడవులను నరకివేసినచోట్ల యేయే పంటలు పండించుచున్నారు ?

జ:—అరటి, పోక, చెరకు తోటలు, వేయుచున్నారు. పెండలము, వరి, ప్రత్తి పండించుచున్నారు. రబ్బరు, పామ్‌నూనె, జిగురును పోగుచేయుచున్నారు.

85. పిగ్మీలనుగూర్చి 3 వాక్యములను వ్రాయుము ?

జ:—మిక్కిలి దట్టమైన అడవులలో పిగ్మీలను మరుగుజ్జువారు దిగంబరులై జీవనము చేయుచున్నారు. వీరు విల్లు, అమ్ములను ఉపయోగించి వేటవల్ల జీవింతురు. వీరికి చదువుసంధ్యలు లేవు. అనాగరికులుగ నున్నారు.

86. ఈ దిగువవాటినిగూర్చి నీకేమి తెలియును ?

1. సెట్సీ. 2. లివింగ్‌స్టన్. 3 కటాంగా. 4. స్టేన్లీ.

జ:—1. సెట్సీ:—కాంగోనదీ మైదానపు అడవులలో పశువులను కుట్టిచంపెడి యీగ.

2. లివింగ్‌స్టన్:—కాంగోనదియందలి జలపాతము.

3. కటాంగా:—యిదియొక జిల్లాపేరు. ఈ జిల్లాలో గొప్ప రాగిగనిని త్రవ్వుచున్నారు.

4. స్టేన్లీ:—కాంగోనదియందలి జలపాతము.

**Syllabus Heading —III-a 6-c. ఆసియాలోని నాడీమండల ద్వీపములు.**

87. ఆసియాలోని నాడీమండల ద్వీపముల కేమని పేరు ? ఇచటి శీతోష్ణస్థితి యెట్టిది ?

జః—ఈ ద్వీప సమూహమును తూర్పు ఇండియా దీవులు- లేక మలయా ద్వీప - సమూహమని పేరు. ఇవన్నియు భూమధ్య రేఖమీద నున్నవి. సంవత్సరము పొడవున వేడిమి, వర్షము అధికముగా నుండును. [illegible], [illegible] ములయందున్నట్లు [illegible] దట్టమైన ఉష్ణమండలపు టడవులున్నవి.

88. తూర్పుయిండియా దీవులన్నిటిలో జావా ఎందుచేత ముఖ్యమైనది?

జః—ఈ ద్వీపసమూహములోనున్న జనసంఖ్యలో ¾ వంతు జనసంఖ్య జావా లోగలరు. ఇచ్చట డచ్చివారు రోడ్లను, ఇనుపదారులను, వేయించిరి. రబ్బరు, కాఫీ సింకోనా, తేయాకు, కోకో, పొగాకు, కొబ్బరితోటలను పెంచుచున్నారు. ద్వీపవాసులకు కావలసిన వరిని పండించుచున్నారు. సగ్గుబియ్యము, చెరకు, పండించుటలో జావా ప్రపంచఖ్యాతి గాంచినది.

89. జావాయొక్క రాజధాని యేది?

జః—బటేవియా.

90 ఈ ద్వీపసమూహములలో పేర్కొనదగిన మరినాల్గు ద్వీపములను పేర్కొని అచటనుండి ఎగుమతియగు వస్తువులను దెల్పుము?

జః—సుమత్రా, బోర్నియో, సెలిబీస్, ఫిలిఫ్ఫైన్ దీవులు పేర్కొనదగినవి.

1. సుమత్రా }
2. బోర్నియో } మిరియములు, కాఫీ, పొగాకు, ఎగుమతిచేయును.

3. సెలిబీస్:—లవంగము.

4. ఫిలిఫ్ఫైన్ దీవులు:—నార, కొబ్బరి, చెరకు, మొక్కజొన్నలు, పొగాకు, రబ్బరు, చుట్టలు.

91. ఫిలిఫ్ఫైన్ దీవు లెవరివి? వాని రాజధానియేది?

జః—ఈ దీవులు అమెరికాసంయుక్త రాష్ట్రములవారివి వానిరాజధాని మేనిలా.

(స శే ష ము).

---

## నీతివిద్య - తదావశ్యకత

(వేముల నరసింహము, బూర్జ)

సృష్టివైచిత్ర్యము వర్ణనాతీతము. ఈ విశాల ప్రపంచమున మానవుల ప్రవర్తనలు అత్యాశ్చర్యకరములు. మహామేధావులు, దేశభక్తులు, సత్ప్రవర్తనులు ధర్మమార్గానువర్తులు, త్యాగమూర్తులు, స్వతంత్రప్రియులు, పడరాని ఇక్కట్లు పడుటయు - దుర్మార్గులు, దేశద్రోహులు, వంచకులు, అన్యాయ ప్రవర్తనులు, అసత్యవాదులు, సుఖమనుభవించుటయు - మనము చూచుచున్నాము.

కొందఱు దేవుడుగలడందురు. కొందరు ప్రకృతి తప్ప వేరుదైవము లేదందురు. పశుబలముకన్న ఆత్మబలమే జయముపొందునన్న వారు కొందఱు మానవబలముకన్న దైవబలమే గొప్పదనువారు కొందఱు మానవ ప్రయత్నములేనిదే యేదియూ జరుగదన్న వారు కొందరు;

పూర్వాచారములే పాటించవలెనను వారు కొందరు, నవీననాగరికత అవలంబించుటే మంచి

దను వారు కొందఱు; హేటు, బూటు, సూటు, ధరించినవారే నాగరికులని కొందఱు.

ఎన్ని దొంగ పత్రములు వ్రాసినను, కూట సాక్ష్యములు చెప్పినను, దౌర్జన్యము ప్రోత్సహించినను ధనము సంపాదించుటే ప్రయోజకలక్షణమని తలంచువారు కొందరు. శిశుహత్యలు, స్త్రీహత్యలు, ఎన్ని చేసినను లోకమునకు వెల్లడికాకుండ చేసితిమని సంతోషించువారు కొందరు.

తాము తప్పుచేసినను తప్పుకాదని నోటిదురుసు తనముచేత జయము పొందితిమని సంతసించువారు కొందరు.

ఎగిరిదంచినా ఒకటే కూలి- ఎగరకదంచినాఒకటే కూలి – మన్నరాబడి మనకువచ్చుచున్నది, పనిచేయక పోయినా బాధలేదని, తలంచువారు కొందరు.

బంగళాలో బస, మోటారుకారులో టూరింగు, క్లబ్బులలో మీటింగు, బ్యాంకులలో డిపాజిట్, చేయుటే గౌరవాస్పదమని తలంచువారు కొందరు.

ఇట్లు భిన్న భిన్న భావముల చేతను, అపోహల చేతను, కార్యముల చేతను, మహాసముద్రమువలెఁ గనబడు ఈ ప్రపంచమందు దేశకాలమాన పరిస్థితుల కనుగుణ్యముగ జీవయాత్రజరుపుటకు మనుజుడను చిన్ననావ చుక్కాని యగునీతివిద్య లేనియెడల దారి తప్పి తారుమారగును.

"పాలదంతాలతటి దిద్దబడనిగుణము
కోరమీసాలనాఁ డది కుదురుటెట్లు ?"

అట్టి నీతివిద్య పిల్లలకు బాల్యమునుండియు గరపవలెను. పిల్లలు కొంతకాలము ఇంటిదగ్గర తల్లిదండ్రులతోను, కొంతకాలము బడిలో నుపాధ్యాయులతోను గడుపవలసియున్నది. కనుక పిల్లల సత్ప్రవర్తనకు ఉభయులు బాధ్యులైయున్నారు.

[illegible] తల్లిదండ్రులు జాగ్రత్త తీసికొనవలెను.

దైవభక్తి, సత్యవ్రతము, భూతదయ, శాంతము, ఓర్పు, బాలురయందు పుత్రవాత్సల్యము గలిగియుండి దుర్వ్యసనములులేక సత్ప్రవర్తన గలిగిన అధ్యాపకోపాధ్యాయునకు ఏ కాలమందైనను గౌరవము తగ్గునా ? దైవసమానుడనుటకు సందియముండునా ?

ఉపాధ్యాయుడు గంజాయి, సిగరెట్లు, చుట్టలు, కాల్చుచు బంగు, కాఫీ, టీ, మొదలగు పానీయములు స్వీకరించుచు కిల్లీమీద కిల్లీ బిగించి పేకాటలో కాలక్షేపము చేయుచు అబద్ధపు అర్జీలు, పత్రములు, వ్రాయుచు కోర్టులంటి తిరుగుచు "మాకు గౌరవము లేదంటే ఎట్లావస్తుంది?

ఉపాధ్యాయుడు బాలబాలికలను ప్రతి దినము సకాలమునకు బడికివచ్చునట్లు క్రమశిక్షణలో నుంచవలెను. వారికి భూతదయ, పరిశుభ్రత, విధేయత, మత్తుపదార్థములను విసర్జించుట, జాగ్రత్త, దేశాభిమానము, వ్యాయామము మొదలగు విషయముల గూర్చి ప్రత్యేకముగను, నిర్ణీతపాఠములతో మిళితము చేసియు ఉపాధ్యాయుడు బోధించి వాటిని అనుభవములో పెట్టునట్లు కృషిచేయవలెను.

ఈ శిక్షణపొందినవారు సత్పౌరులు దేశోద్ధారకులు గాగలరు.

---

## ఎనిమిదవ తరగతి పబ్లికు పరీక్ష.

జంధ్యాల వేంకటశేషయ్య, హెడ్మాష్టరు, చిన ముక్తేవి.

ఎనిమిదవ తరగతి ప్రస్తుత పరీక్షను విద్యాశాఖాధికారులు బాగుగ నాలోచించి ప్రవేశపెట్టిరనుటకు సందియములేదు. రాజధాని కరితకును హెచ్చుతగ్గులు లేక విద్యార్థుల మానసిక శక్తులను, విద్యాభివృద్ధిని పరీక్షించుట కొకే ప్రమాణమును నను సరించుట మిక్కిలి యుత్తమమైన పద్ధతి. అందువల్ల నీ తరగతికి బోధించు నుపాధ్యాయులకు నూతనోత్సాహము రేకెత్తినది. ఆ పరీక్షలో నుత్తీర్ణులు కాఁదలచిన విద్యార్థుల పట్టుదల, కార్యదీక్షవృద్ధియైనవి. ఈపరీక్షయేర్పాటుచేయఁబడినప్పుడు ప్రాథమిక విద్యకుకూడ పూజ్యస్థానము లభించినదని యుపాధ్యాయబృందముప్పొంగినది.

కాని కాలక్రమమున నట్టి యాశలన్నియు నడియాసలని బుజువైనవి. గ్రామస్థులకీ పరీక్ష యెంతమాత్రమును నాకర్షణీయముగ గాన్పించుటలేదు. తల్లిదండ్రులు సెకండరి విద్యయందు గల యభిలాష విద్యాశాఖవారి ప్రాథమికోన్నత విద్యను తమంతట దా మవసరమైనంత నొందునదిగను, తమవిధముగ నగ్గుబుగ నున్నను. ప్రోత్సాహము జేసిరేకాని, దానినంతను పైవిద్యకు సోపానముగ జేయలేదు. ప్రాథమికోన్నత పాఠశాలలో "ఇంగ్లీషు" నిర్బంధపాఠ్యాంశములలో నొకటి కాకపోవుటచే, దాని బోధన స్వల్పమను సంగతి విద్యాధికులందఱెఱింగిన విషయమేకదా! ఎనిమిదవ తరగతి పరీక్షలో గృతార్థులైనవారును, కానివారును, ఏడవతరగతి ప్యాసైనవారును, ఇంగ్లీషులో ప్రత్యేక బోధన వడసి మూడవఫారములోనే జేరుట తటస్థించుచున్నది. అందువల్ల ప్రత్యేకముగ ఎనిమిదవ తరగతి పబ్లికు పరీక్షకు హాజరుగు విద్యార్థులు బోధనాభ్యసన పాఠశాలా ప్రవేశము నపేక్షించువారే; గాని మాధ్యమికవిద్య నభ్యసింప గోరికగలవారికది లాభదాయకము కాదు గదా?

ఈ బదులలో భాష, చరిత్ర, భూగోళశాస్త్రము, లెక్కలు మున్నగు పాఠ్యాంశములలో బోధనాపటిమ మాధ్యమిక పాఠశాలలకంటె తీసిపోవుటలేదు. ఈ పాఠ్యాంశములలో ఎనిమిదవ తరగతి పరీక్షలోను త్తీర్ణులై, మాధ్యమిక పాఠశాలలో ప్రవేశించిన విద్యార్థులు, తదితర విద్యార్థులకంటె మిన్నగనుండిరను విషయము మను భవము వలన విదితమగుచున్నది. కాని ఏమి లాభము? స్వల్పవేతనముతో దనివి జెంది ప్రాథమికోన్నత పాఠశాలోపాధ్యాయులెంత కష్టించి భాష, లెక్కలు (గణితము) చరిత్ర, భూగోళశాస్త్రము, బోధించినను వారియందు పల్లెగ్రామస్థులు తృప్తిగ లైనను, తమ విద్యార్థులు మాధ్యమిక పాఠశాలలో స్థానము దొరకకపోవుటచే వారు నిరుత్సాహులగుచున్నారు. వారి కృషి భస్మాహుత్యముగ నున్నది. విద్యార్థుల సంఖ్యయు నానాటికి తగ్గుచున్నది

అదియుంగాక ధనము వెచ్చించికొనిన వస్తువునందే మానవునకు లక్ష్యముండును. డబ్బును ఖర్చుపెట్టిననే విద్యకు విలువ వచ్చును. కనుక తల్లిదండ్రుల ప్రస్తుతావసరముల కనుగుణ్యముగ నీ పరీక్షావిధానమును మార్పుజేసినపుడే వారికి మా పాఠశాలలందు గౌరవము కల్గును. విద్యాశాఖాధికారులందరీ యనుభవసిద్ధమైన కష్టములను విచారించి యీ పరీక్షా విధానములో కొన్నిమార్పులను జేయకపీలులేదు. అట్టి మార్పు లీక్రింది సూచనలపై నాధారపడి యుండవలయునని మనవి.

(1) ఎనిమిదవ తరగతి మాధ్యమిక పాఠశాలలకు సోపానముగ నుండవలెను.

(2) "ఇంగ్లీషు" కూడ ఎనిమిదవ తరగతి పరీక్షాంశములలో నభిమానాంశముగజేసి పబ్లికుపరీక్షలో ఇంగ్లీషులో నూటికి 35 లేక 40 గుణకములను, తదితర పరీక్షాంశములలో, నియమిత గుణకములను, గడించిన విద్యార్థులు నాల్గవ ఫారములో ప్రవేశించుట కర్హులుగ జేయవలెను. అట్లు 'ఇంగ్లీషు' లో గృతార్థులుగాక, మిగిలిన పరీక్షాంశములలోను త్తీర్ణులైన వారిప్పటివలె బోధనాభ్యసన పాఠశాలా ప్రవేశమున కర్హులు.

(8) ఇంగ్లీషుతోఁగూడ ఎనిమిదవ తరగతి పరీక్షకు హాజరుకాఁదలచు విద్యార్థుల నుండి నెలకు కొంత జీతము వసూలు చేయవలెను.

ఈ మార్పులఁ జేసిన, ప్రాథమికోన్నత పాఠశాలలకు బి.యిడి. లను ప్రథమోపాధ్యాయులుగ నియమించుటచే, ప్రభుత్వమునకుఁ గొంత యదనపుఖర్చు తగులును సందియమునకు తావులేదు; ఏలయన పబ్లికుపరీక్ష ఇంగ్లీషులో జరుగును: కనుక ఆంగ్లేయభాషలోఁ గూడ తృప్తికరమైన యభివృద్ధికల విద్యార్థియే పరీక్షలో నుత్తీర్ణుడగును. సెకండరీ గ్రేడు ఉపాధ్యాయుడు ఆంగ్లభాషను ఎనిమిదవ తరగతికి భోధించుటచే, ఆవిద్యార్థుల భాషాభివృద్ధి పరిపూర్ణమైనది కావను శంకయే రాదు.

ఈ సూచనలను విద్యాశాఖాధ్యక్షులగు శ్రీ శ్రీ స్ట్రాతం దొరగారమలులోఁ బెట్టినయెడల ప్రాథమికోన్నత పాఠశాలల విచ్ఛిన్నముగ వర్ధిల్లును. జానపదులకు ప్రాథమిక విద్య కొంగు బంగారమై, సర్వశుభప్రదమై, యనూనాదరణ పాత్రమై విరాజిల్లఁగలదని ఘంటాపథముగఁ జెప్పుచున్నాడను.

---

# తిమ్మరుసు

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య.

తే॥ గీ॥ బ్రతికి చెడినట్టి నియొుపేద వంశమందు
జననముం జెంది నీదు ప్రజ్ఞాబలమున
శస్త్రకర్ణాట సామ్రాజ్య సచివుఁడవయి
మించు పేరును గల్గి రాణించినావు.

ఉ॥ నీముఖమండలంబు గణనీయగుణాఢ్య వచస్సరస్వతీ
ధామము నీదు జన్మమిడి ధన్యతఁ జెందఁగ నెంతలెంతలో
నీమములూని నిష్ఠమెయి నిచ్చలు మాదు తెలుంగుతల్లి యే
నోములు నోఁచి నిన్నుఁ గనెనో స్మరణీయ! అమాత్యశేఖరా!

తే॥ గీ॥ నామమాత్రావశిష్టమౌ నవ్యవిజయ
నగరసామ్రాజ్య మల వింధ్యనగమువఱకు
నలముకొని వ్యాపనమున ననంత మగుచుఁ
బ్రాఁకి పోయెడిదా? నీదు ప్రతిభ లేక.

చ. ముసరు విపత్తులన్ మునిఁగిపోయెడు కృష్ణధరాధినాధునిం
బసితనమందునుండియుఁ గృపాపరతంత్రత విస్తరింప నీ
నిసుఁగునుబోలెఁ గాచి యవనీపతిఁ జేసిన ప్రోఢవైన నీ
యసదృశ పేర్మితత్వము సమాదరమైనది మంత్రిసత్తమా!

చ. గజపతిభూపతు కక్కసపు ఖడ్గము బారికి నోగిరాఁగుగా
కిజటిలహారికి యవనేతుల గాఢపు దుర్గ్యము బారిఁజూపించి యు
క్కజముగఁ గృష్ణభూవిభుని గాచి యుపాయముఁ బాసినట్టి యో
సుజన విధేయ! గనవరా తిమ్మరుసా నీయు దరి వెవ్వరికిని ?

సీ. భామినీ సామ్రాజ్యపాలకావళిచేతఁ గప్పంబుఁ గొనినట్టి ఘనత యొకటి
రాయచూ రుద్రగల్లు రాజుల శౌర్యంబు, మీఱఁగాఁ జాలిన నేరు పొకటి
ఉత్కళేశునితోడ యుద్ధంబు నొనరించి కావరం బడఁగించు కీవి యొకటి
కటకంబునం గెల్పుకంబము నాటించి విజయంబుఁ బేర్కొను వీఁక యొకటి

తే॥ గీ॥ నీవె యార్జించి తవియంగ నిచ్చలేక
ప్రభువునకుఁ గూర్చునట్టివిరాళిఁ గల్గి
సరళి నుత్సాహ ప్రభుమంత్రశక్తు లలరఁ
బాలనము సల్పు కీర్తివిభ్రాజితుఁడవు.

తే॥ గీ॥ రాజరాజగు శ్రీకృష్ణరాయవిభుఁడు
రణజయోత్సాహ మహిత నీరాజనముల
నంది యష్టదిగ్గజముల నైన మధుర
కావ్యములఁ గృతు లందఁగఁ గారకుండ
వీవెకావె? తిమ్మరుసుమంత్రీంద్ర! చెపుమ.

ఉ॥ అన్నియుఁ బాసి రాజుకొఱకర్థము ప్రాణము ధారవోసి యె
న్నెన్నొ మహోపకారము లహీనరయంబునఁ జేయు నీకటుల్
కన్నకుమారునాత్మ నొడిఁగట్టి మహీపతి ధర్మశూన్యుఁడై
కన్నులుదీయ నాజ్ఞ యిడెగా యిది యెక్కడి వైపరీత్యమో ?

ఉ. చెప్పుడుమాటల న్విని యచింత్యము చింత్యము నూహసేయకే
యప్పటి కాత్మఁదోఁచినటు లాచరణం బొనరించెఁగాని యా
తప్పిదు తోఁచి వముం దెటులఁ దన్ను బలిం గొనునో యెఱుంగకే
ముప్పును గోరి తెచ్చుకొనె మూర్ఖత రాజుల నైజమేకదా!

తే. గీ. ఊరకే రాలిపోవు నీయుసురు దగిలి
సార్వభౌముం డుగూడ దా సమసిపోయె,
విజయనగర సామ్రాజ్యభూమిజము కూలె
చిరయశము నీకె దక్కె తిమ్మరుసుమంత్రి!

# తప్పెవరిది?

(ప్రాథమికవిద్య యందు ప్రజల బాధ్యతను గుర్తింపజేయు చిన్న నాటిక)

జి. కె. చౌదరి

(గతసంచిక తరువాయి)

## నాలుగో రంగము.

మా ప్రాథమిక పాఠశాలా వార్షికోత్సవ సభామంటపము. చక్కగా అలంకరింపబడింది. గ్రామస్థులందరు తమ స్వంత పనిగా భావించి పనులన్నిటిని పూర్తిగా వించారు. సభాధ్యక్ష్యులు శ్రీ రమణరావు M. Sc. ప్రేక్షకస్థానములో మాండలిక విద్యాధికారులు కేంజి విద్యాధికారులు కూడ వున్నారు. ఇరుగుపొరుగు గ్రామాల నుంచికూడ చాలమంది వచ్చారు ఆసభాశాలలో పాఠశాలావిద్యార్థులు గావించుతున్న స్వచ్ఛందసేవస్తుతి పాత్రము. చీమ చిటుకుమంటే వినబడేటంత నిశ్శబ్దముగా వున్నది. సభాశాల అధ్యక్షులు లేచి-

అ:-తల్లులారా! తండ్రులారా! ఒకప్పుడు రేపో మాపో యెత్తివేయడానికి సిద్ధముగావున్న ఈ పాఠశాల ప్రస్తుతము నలుగురుపాధ్యాయులతో పనిచేస్తూ గ్రామస్థులయొక్క శ్రద్ధను చూరగొని ఇంతమంది తల్లులు తండ్రులను సమీకరించి వార్షికోత్సవము చేసుకొను మహాభాగ్యముపొందినది అంటే ఇందు ఉపాధ్యాయులు గ్రామస్థులుకూడ అత్యంతము స్తవనీయులు. ఎన్నోవిధాలుగా మీ అందరిలోను చిన్నవైన నన్ను సభాధ్యక్షునిగా యెన్నుకొనుట నా యదృష్టము. ఈ పాఠశాలయందు తమకున్న సద్భావాన్ని తెలియజేయడానికై ఇటకువచ్చిన విద్యాశాఖాధికారులకు ప్రేక్షకులుగావచ్చిన యితర గ్రామస్థులకు నా మనఃపూర్వకాభివందనాలు. తరువాత కార్యక్రమము. తల్లిదండ్రుల సంఘాధ్యక్షులు శ్రీ నరసయ్యగారు మాట్లాడతారు.

న:-సోదర సోదరీ మణులారా! మన పాఠశాల ఈ స్థితిలో వుంటుందని మనలో ఏ నక్కరూ ఊహించి యుండ లేదు. ఈ పాఠశాల యీ స్థితిలోవుండడానికి సభాధ్యక్షులైన రమణరావు, సంజీవరావుగార్లే కారణము. ఉపాధ్యాయులుకూడ ఏదో విధముగా కాలము వెళ్ళబుచ్చకుండా మనిక్కాక-నిరక్షరాస్యతకు పేరెల్లిన భారతదేశాన్ని మనస్సులో వుంచుకొని ఈ విద్యార్థులను సత్పౌరులుగా ఒనరించవలెననెడి వారి సత్సంకల్పము మమ్మెంతయు ఆనంద పరవశులజేయు చున్నది.

మా బాలసంఘాన్నిగూర్చి ప్రత్యేకముగా చెపుతున్నా. బాలసంఘ నిబంధనలను కట్టుబాట్లను వారందరు జాగ్రత్తగా పాలించుతున్నారు. వారిలో యెవరైనా కాని పనిచేసినపుడు బాలసంఘమువారే తగు విధముగా మందలించి అట్టి పనులు మరలచేయకుండునట్లు చేస్తున్నారు. సాంఘిక సేవలో రాయలసీమ బెంగాలు కరువులకు బారులుతీర్చి పాటలు పాడుకుంటు చేర్చిన వసూళ్లు మరపునకు రావు. అన్నా

తురులై వచ్చిన వారికి ఈ సంఘసభ్యుల ద్వారా కావలసినంత అన్నము. ఈ బాల సంఘము చేస్తున్న ప్రతిపని పెద్దవాళ్ళ సాయంగా మా గ్రామ ఉత్సాహపూరితులుగా చేయడమే గాక కార్యోన్ముఖులుగా చేస్తున్నది. ఇదంతా ప్రస్తుతోపాధ్యాయుల చలవే తమ బిడ్డలు ఈవిధముగా ఉత్తమ మార్గాన సాగిపోతుంటున్న ఏ తల్లిదండ్రులు సంతోషించరు?

మా గ్రామసంఘము వారు ప్రాథమిక విద్యావశ్యకతను గుర్తించి, పాఠశాలాభి వృద్ధికిగాను గ్రామాదాయమును నాలుగో వంతు విడదీసి తల్లిదండ్రుల సంఘము వారికిస్తున్నారు. దానితో అత్యావసరముగా కావలసిన బోధనోపకరణములను కొన్నాము. గ్రామస్థులందరి సహాయమున ఇద్దరు ఉపాధ్యాయులు నివసించుటకు సరిపడు వసతిగృహమును నిర్మించాము. మిగిలిన ఇరువురకు కూడ వసతిగృహము లేకపోయినప్పటికిని, వాసనౌకర్యాలను మేమే కలిగిస్తున్నాము. పైవిధముగా వచ్చిన గ్రామాదాయముతోను, గ్రామస్థుల సహకారముతోను, మా పాఠశాల ఆదర్శముగావున్నదని చెప్పుకొనడానికి గర్వపడుతున్నాము. (కరతాళధ్వనులు)

ఈ ఉపాధ్యాయులను మానుండి విడదీయడానికి ఎవరికీ శక్తిలేదు. వారు గ్రామస్థులలో గ్రామస్థులుగా నివసిస్తున్నారు. గ్రామస్థులకు, ఉపాధ్యాయులకు, వున్న సంబంధము అభేద్యము. ప్రతిగ్రామాన కూడ ఇట్టి సామరస్యము ఏర్పడినప్పుడే ఉపాధ్యాయుల వలన తగినంత ప్రయోజనాన్ని గ్రామస్థులు పొందగలుగుతారు. ఇది నాయనుభవము సెలవు. (నమస్కారము చేయును. కరతాళధ్వనులు)

౧౧: హెడ్మాస్టరుగారు కృతజ్ఞతాదారు (హెడ్మాస్టరు ప్రవేశించి కృతజ్ఞత [illegible] తగిలించేటప్పటికి అపూర్వ కరతాళ ధ్వనులు.)

హెః-సభాధ్యక్షా! సోదర సోదరీమణులారా! ఈ మహాసభకు ప్రేక్షకులుగా వచ్చిన అధికారులకు, అన్యగ్రామస్థులకు, మా పాఠశాల తరపున ధన్యవాదాలు. ప్రస్తుత పరిస్థితులను బట్టి మేము ఈ గ్రామస్థులచే బంధింపబడ్డాము. ప్రతిపౌరునకు కూడ, స్వప్రయోజనము కొరకు ఉపాధ్యాయుని ఈవిధముగా బంధించే అధికారమున్నది కాని బంధించే మార్గముకాని - ఉపాధ్యాయుని ప్రయోజనముగాని, తెలియక అంధకారములోవున్న వారికి ఈమహాసభయే మేలుకొలుపు. నాస్థితికి బడిపంతులుతో పోట్లాడనా అనే అహంకారులకు, కర్తవ్యాన్ని బోధిస్తుంది. విద్యార్థులకు వ్రాత, చదువేకాదు ఆవశ్యకత. అంతకన్న దొడ్డదైనసద్వర్తన, సంఘసేవ, దేశసేవ అని మా బాలసంఘమే ఋజువుచేస్తున్నది.

మేము ఏలోపమూ యెరుగము అని కాదు. మాలోపము తెలుసుకున్నప్పుడు దిద్దుకొని, అనవరతమూ పురోగాములుగా ముందుకు పోవడానికి ప్రయత్నము చేస్తాము. భావిపౌరులగు బాలురను సత్పౌరులుగా చేయుటలో మాలక్ష్యము అభేద్యమైనది. ఈవిషయములో ప్రాథమికోపాధ్యాయుని సేవజగద్విదితము. నేడో రేపో ఎత్తివేయడానికి సిద్ధముగా యీపాఠశాల, ప్రస్తుతము ఈ స్థితిలో వున్నది అంటే మీకు మాత్రము ఆశ్చ

ర్యముగా లేదూ? దీనికంతకూ కారణము గ్రామస్థుల సహకారము ఈవిధముగా ప్రతిపాఠశాల రూపాంతరము పొందిన నాడే పరాధీనము అభాగ్యము ఐన మన దేశానికి స్వాతంత్ర్యచ్ఛాయలు దాపులోనికి వస్తాయి.

స్వప్రయోజనముకొరకు మాత్రమే మనలను పాలిస్తున్న సామ్రాజ్యవాదులు, మనకు ఇంతకన్న ఉత్తమశిక్షణను కలిగిస్తారు అనుకోవడము భ్రమ. అట్టిభ్రమను పటాపంచలు గావించి, ఆశా కిరణములు రేకెత్తింపజేసినది. ఈ గ్రామస్థులు-పాఠశాల ఇందు ఉపాధ్యాయుల ప్రయోజకత్వముకన్న గ్రామస్థుల సహకారమే ఈ విజయానికి బలీయమైన పునాదిరాయి.

ఈ గ్రామస్థుల మహత్తర విజయాన్ని అండగా తీసుకొని, ప్రతిగ్రామము ఒక పాఠశాలతో వుండాలనీ-ప్రతి పాఠశాల విజయోత్సాహాలతో ఉట్టిపడేట్టు చేయమన అదంతా ప్రజాశక్తేనని హెచ్చరిస్తూ విరమించుచున్నాను. (వెడలిపోవును. కరతాళధ్వనులు)

అః-జిల్లావిద్యాశాఖాధికారులు మాట్లాడతారు.

జిల్లావిద్యాశాఖాధికారి:- అధ్యక్షా, సోదర సోదరీమణులారా! నేను ప్రాథమిక పాఠశాలా వార్షికోత్సవాన్ని చూడడానికి ఇదే మొదలు. అందులోను ఇది, ఏకలిగిన వారిచేతనో పదిరూకలు ఖర్చుపెట్టించి, అధికార ప్రాబల్యాన్ని సంపాదించటానికై ఏర్పాటుచేసిన సమావేశము కాదనీ గ్రామస్థులు స్త్రీపురుషులందరి సహకారముతోను ఏర్పాటు చేయబడిందని, తెలుసుకొని సంతోషిస్తున్నాను.

న్యాయంగా ప్రతి పాఠశాల ఈస్థితిలో వుండేట్టు చేయవలసిన బాధ్యత ప్రభుత్వానిది. ప్రభుత్వానికి తగినంత ధనము లేకపోవడము చేతనే మన ప్రాథమిక విద్య నానాటికి దిగజారిపోతూ వుంది. ప్రభుత్వ సహాయము చెప్పుకోదగిన స్థితిలో లేనప్పటికీ-ప్రాథమిక పాఠశాలనుగూర్చి ఇంతటి శ్రద్ధను తీసుకొని, మహత్తర కార్యసాధనకు పూనుకున్న గ్రామస్థులను-శ్రద్ధకు తగిన ప్రతిఫలాన్నిచ్చిన ఉపాధ్యాయులను ప్రశంసిస్తూ - ప్రభుత్వముద్వారా మీకు కావలసిన అన్ని సహాయములను చేయుటకు సిద్ధముగా వున్నావని తెలియజేస్తూ- త్వరలోనే ఈ పాఠశాల ప్రాథమికోన్నత పాఠశాలగా అభివృద్ధియగుగాక యని కోరుతూ విరమించుచున్నాను. (కరతాళధ్వనులు.)

అః-డిప్యూటీ ఇనస్పెక్టరుగారు మాట్లాడుతారు.

డిప్యూటీ ఇనస్పెక్టరు:—అధ్యక్షా! మహాజనులారా! మీ పాఠశాలను, ఈ మహాసభను చూచి నేను పొందినంత ఆనందాన్ని మరెవ్వరూపొందలేదు అంటే అతిశయోక్తికాదు. బిడ్డయొక్క అభివృద్ధికి తల్లి ఏవిధముగానూ సాయపడలేకపోయినప్పటికి, బిడ్డఅభివృద్ధిని చూచి తల్లి మురిసిపోతూ వుంటుంది. ఆవిధముగానే ఈపాఠశాలనుచూచి నేను పొందే ఆనందము చెప్ప శక్యముకాదు.

ఈ గ్రామమువల్ల నేను ఒక్క విషయాన్ని తెలుసుకున్నాను. ఊరూరా - అంటే ప్రాథమిక పాఠశాలవున్న ప్రతి గ్రామంలోనూ - తల్లిదండ్రుల సంఘము వుంది. ఆ సంఘాలవల్ల ఆయా పాఠశాల

లకు ప్రయోజనము వుందా అంటే. శూన్యముఅని చెప్పాలి. కారణము — సంఘాలకూ, ఉపాధ్యాయులకూ — సన్నిహితమైన పరస్పరసంబంధమూ లేకపోవటమే.

"వెలపటిది ఏటికిలాగితే — లోపటిది బీటికి లాగింది" అన్నట్లు పరస్పర సహకారము — అన్యోన్యత — లక్ష్యసిద్ధి కొరకు ప్రయత్నము లేని తల్లిదండ్రుల సంఘాలు వున్నా ఒకటే లేకపోయినా ఒకటే. ఐనా అవసరాన్ని, ప్రయోజనాన్ని గుర్తించకుండా ప్రభుత్వ ఫర్మానాలకు లోబడి స్థాపింపబడ్డ సంఘాలవల్ల అంతకమించి ప్రయోజనము వుంటుందని అనుకోవడమూ వెఱ్ఱే. ప్రస్తుతము ఊరూరా వున్న సంఘాలే తమబిడ్డల అభ్యున్నతికి తోడ్పడేట్టు — ప్రాథమికోపాధ్యాయులకు వలసినంత చేయూత నిచ్చేందుకు సాయపడేటట్టుగా, సామరస్యతను చేకూర్చుటకు ప్రయత్నము చేస్తానని ఇందుమూలముగా మనవిచేయుచున్నాను.

[వెళ్ళిపోవును. కరతాళ ధ్వనులు.]

అ:- చౌదరయ్యగారు మాట్లాడుతారు.

(దేహచ్ఛాయ నశించి, ముడతలుపడ్డ శరీరము. నిండునీర్కావిథోవతి, తెల్లతలగుడ్డ — మరొక తెల్ల పంచెవల్లెవాటు — పొన్నుకఱ్ఱ — తెల్లని కోరమీసాలు గల చౌదరయ్యగారు స్టేజి యెక్కటప్పటికి కరతాళ ధ్వనులు.)

చౌ:- (గొంతుక సవరించుకొని) నాకు యెనభయ్యేళ్లు. నేను పుట్టి బుద్ధియెరిగిన తరువాత యిటువంటి మీటింగు యీ వూళ్లో జరగలేదు సరేకదా జరుగుతుందని అనుకోలేదుకూడాను. మీరా అందర్నీ ఒక్కచోట చూడటం మూలంగా నాకు ఎంతో సంతోషముగా వుంది. దీని అంతటికి ప్రధానహేతువైన ఉపాధ్యాయుల్ని మెచ్చుకోవాలి. పిల్లలుగా మామూలు చదువుసంధ్యలతోపాటు — నీళ్ళు ఆటపాటలు ముచ్చటగా వున్నాయి. నేను చదువుకున్న కాలంలో బడి అంటే అదొక కటికి (కసాయి) కొట్టాము. నన్ను కోదండము తీయించి క్రింద రేగు కంప వుంచారు — నేను ఏవిధముగా బ్రతికి బయటపడ్డానో చెప్పలేను. కనుకనే ఇప్పటికికూడా నాకు బడి అంటే చిన్నప్పటి అదటు తగ్గలేదు. ఇంకా చాలాచోట్ల వుపాధ్యాయులు పిల్లల్ని తీవ్రంగా శిక్షించడం నేను చూస్తూన్నాను. కాని మన వుపాధ్యాయులు బెత్తాలను దూరముగా పారవేసి ఏనాడయిందో! కావలసినడవగల శక్తివున్న ప్రతిబిడ్డను బడి అంటే అంత సంతోషముగా వస్తున్నాడు. బడిఅంటే పారిపోయే వాడుగాని — పట్టుకు తీసుకురాబడేవాడుగాని — పని కల్పించుకొని ప్రాలుమాలే వాడుగాని — మనవూరు మొత్తానలేడు. (కరతాళ ధ్వనులు) ఇదంతా వుపాధ్యాయుల గొప్పతనమే. అంతేకాక బాల సంఘము. అంతగా పెట్టి బిడ్డల ప్రవర్తనలో తెచ్చినమార్పులు చెప్పలేను. ఈ వుదయము బారులుతీరి జండాలు చేతపట్టి — "బాల సంఘ సభ్యులం — భరతమాత పుత్రులం" అంటూ కుడియెడమల క్రమంలో నడుస్తూవుంటే చూడ ముచ్చటయింది. అప్పటికీ ఇప్పటికి ఎంత వ్యత్యాసము? అనిపించింది. ఈ వుపాధ్యాయుల సేవను — గ్రామస్థుల సహకారాన్ని — విద్యార్థుల అభివృద్ధిని — చూచి సంతోషిస్తున్నాను. ప్రతి వూళ్లో బడీ ఇటువంటి మార్పులుపొందితే ఎంత బాగుంటుంది?

(వెళ్ళిపోవును. కరతాళధ్వనులు)

అః-మహాజనులారా, ఇప్పటికే చాలా కాలం గడిచిపోయింది. డి. ఇ. ఒ. గారి వంటి అధికారులు, చౌదరయ్యగారివంటి అనుభవశాలురు, హెడ్మాస్టరుగారివంటి కార్యదక్షులు, సరసయ్యగారి వంటి గ్రామ పెద్దలు, మాట్లాడిన పిమ్మట నేను మాట్లాడటము అంటే హాస్యాస్పదమే. కాని మిమ్మల్ని ఆట్టేసేపు విసిగించను- మన దేశములో చదువుకున్న వాళ్లు నూటికి 8 మంది. తోటిదేశాలతో పోల్చి చూస్తే హీనాతిహీనమైనసంఖ్య- ప్రజలు విద్యావంతులైతేనేగాని వివేకము, విజ్ఞానము, వర్ధిల్లదు; జాతీయముగాను, అంతర్జాతీయముగాను, కలిగేమార్పులను తెలుసుకోలేరు. మన దేశముక్కూడ, వ్యావసాయకంగాను, పారిశ్రామికంగాను, వృద్ధిజెంది, స్వతంత్ర దేశమై సభ్య దేశాలతో సమాన గౌరవ ప్రతిపత్తులు సంపాదించాలి అంటే నూటికి నూరుమంది విద్యావంతులు కావాలి.

(కరతాళ ధ్వనులు)

మన సర్వతోముఖ వివృద్ధికి అన్ని విధాలుగాను సాయపడవలసింది ప్రభుత్వము. అన్ని ప్రభుత్వాలు ఆ విధముగానే పాటు పడుతున్నాయి. కాని మన ప్రభుత్వము తద్వ్యతిరేకము. కారణము పరాయి ప్రభుత్వము కావడమే. ఆంగ్లదేశపాలనలో ప్రపంచాతీత విధానాలను అమలుజరుపుకుంటు ప్రపంచగౌరవ మర్యాదలను చూరగొంటున్న బ్రిటిష్ ప్రభుత్వము, "ఎవరికి పుట్టిన బిడ్డరా వెక్కి వెక్కి ఏడవను"అన్నట్టు హిందూ దేశ విషయములో ప్రతిచిన్న విషయానికి మొండిచెయ్యి బయటపెడుతూవుంటుంది. మన ప్రాథమిక విద్యను చూడండి భారతీయులకు చదువునేర్పు చేయువలసిన బాధ్యత తమది కానట్టుగానే తలుస్తూవుంది. విద్యలో, విజ్ఞానములో, వెనుకంజవున్న మన విద్యార్థులను బడికి ఆకర్షించే పద్ధతిగాని- ప్రచారముగాని, అవలంబించడంలేదు. గాలిలో దీపంపెట్టి దేవుడా నీమహిమ చూపట్టు, ఊళ్ళో ఒక బడిని స్థాపించడము- తగినంత మంది పిల్లలు బడిలో లేకపోతే ఎత్తివేయడమూను అంతేగాని బాధ్యతతో - నిర్బంధముగానైనాసరే చదువు నేర్పే బాధ్యత ప్రభుత్వానిది కాదన్నట్టుగా మెలగుతూవుంది. ఇటువంటి పరిస్థితులలో ఈ గ్రామస్థులు ఒక గొప్పవిజయాన్ని సాధించారు ప్రభుత్వము చెయ్యవలసిన కట్టుబాట్లున్నీ తమకు తామే తామేగావించుకొని, రేపోమాపో కూలిపోనున్న ప్రాథమిక పాఠశాలకు, నూతన్నయవ్వనాన్ని, శోభను చేకూర్చారు. ఈ విధముగానే ప్రతిగ్రామములోని పాఠశాల కూడ పునరుద్ధరింపబడి తగినంత ప్రయోజనాన్ని ప్రజలు పొందేటట్లుగా చేయడము ప్రతిఒక్కని బాధ్యత ప్రథమంలో ప్రాథమికోపాధ్యాయుని ప్రయోజనాన్ని గుర్తించాలి ఆ ప్రయోజనాన్ని గుర్తించినవారు కావడముచేతనే సరసయ్యగారు "మాకు, ఉపాధ్యాయులకువున్న సంబంధము అభేద్యము మానుండి వుపాధ్యాయులను వేరు" చేయుశక్తి యెవరికీ లేదు. మేమే వారు-వారే మేము అని చెప్పగలిగినారు వారి మాటలు వారివిశాల హృదయాన్ని చాటడమేకాక, సగర్వంగా సంతోషించ తగినవిగాను వున్నవి.

ప్రజలలో మార్పు ఎట్లు అవసరమో,

అన్నీ ఉపాధ్యాయులలోను, బోధనలోను, శిక్షణలోనుకూడ, తీవ్రతరమార్పులు అవసరము. చౌదరయ్యగారి హితబోధ అమూల్యమైనది. తన విద్యార్థిదశలో శిక్షణ ఎంత క్రూరముగాను, నిర్దాక్షిణ్యముగాను, వుండేదో చెప్పారు. ప్రస్తుతము శిక్షణ అంత రాక్షసంగా లేదుగాని, ఎంతో మార్పు అవసరము. ఒక్క సంగతి. ఏ ఉపాధ్యాయుడైతే శిక్షించి చదువు చెప్పాడో ఆయన అసమర్థుడు న్యాయంగా ఉపాధ్యాయులలో ప్రజలలోకూడ తగు విధంగా మార్పులు వచ్చిననాడే ప్రాథమికవిద్య రాణిస్తుంది. తద్వారా దేశసౌభాగ్యము ప్రపంచకల్యాణమూను ఇనస్పెక్టరుగారు అన్నట్లు తలిదండ్రుల సంఘాలకు ఉపాధ్యాయులకు సామరస్యము ఏర్పడటము తొలి విజయము.

మనది జాతీయప్రభుత్వమే అయితే మన అభివృద్ధికి వలయు సర్వసన్నాహాలు ప్రభుత్వమే చేసివుండేది. అట్లు కానప్పుడు మనమే శాయశక్తులా ప్రయత్నముచేసి మన పురోభివృద్ధికి వలయు గవాద్వారాల నేర్పరచుకోవలసినది మనవిధి. అందుకొరకు తొలిబాటే ప్రాథమికవిద్య.

నేను మిమ్మందర్నీ ప్రార్థించే దేమంటే "ఈ మహాసభమూలంగా తెలుసుకొన్న అమూల్య విషయాలను కార్యరూపేణా సాధించ ప్రయత్నించమని"

నాకీ సభాధ్యక్షస్థానమిచ్చి గౌరవించిన గ్రామస్థులకు ఉపాధ్యాయులకు సభాకార్యక్రమములో శ్రద్ధగా పాల్గొన్న మీ అందరికీ నమస్కారము లర్పించుచు సమావేశమును ముగించుచున్నాను.

హెం:-భాగమని తలపక సభాధ్యక్షతను అంగీకరించిన శ్రీ రమణారావు M. Scగారికి ఎన్ని పనులున్నప్పటికి ఈ సమావేశమున కరుదెంచి అమూల్య సందేశాలు నిచ్చిన విద్యాశాఖాధికారులకు యీ మహాసభావకాశమును కలిగించుటయేగాక వారి అమూల్య అనుభవాలను చెప్పిన చౌదరయ్య ప్రభృతులకు మాయందున్న అభిమానము కొద్దీ సభ కరుదెంచిన ప్రేక్షకులకు మా పాఠశాలతరఫున వందనము లర్పించుచున్నాను.

(సమాప్తము)

## సంపాదకునకు లేఖ

### ఆంధ్రరాష్ట్ర ప్రాథమికవిద్యా సంపాదకులవారికి

ఆర్యా!

అతిప్రాముఖ్యమైన యీ క్రింది విషయమును తమ పత్రికాముఖమున వెలువరచి విద్యాధికారులకు యస్. యస్. యల్. సి. ప్యాసైన ట్రైనింగ్ టీచర్లకు రానున్న ముప్పును అందజేసి మామన్ననలందుదుగాక యని మిక్కిలి కోరుచున్నాను.

ఇటీవల మద్రాసు గవర్నరుగారి సలహాదారులగు సర్. టి. ఆస్టినుగారు టీచర్సు కాలేజి వార్షికోత్సవసందర్భమున సెకండరీగ్రేడు తర్ఫీదుపొందు వుపాధ్యాయులకు త్వరలో స్టైపెండ్సు ఇయ్యబడుననియు ఎయిడెడ్ పాఠశాలలో పాధ్యాయులకు కరువుబత్తెముల మరల హెచ్చింతురనియు తదుపరి వీలుగలిగిన ఎయిడెడ్ పాఠశాలలకు నెలవారీగ్రాంట్లు నిప్పించుటకు ప్రయత్నములు సాగింతుమనియు తమ ఉపన్యాసమందు ముచ్చటించి యుండిరి. అందుకు వుపాధ్యాయులోకము వారు మద్రాసు గవర్నమెంటువారి ఉదారశ్రద్ధావమునకు తమ ధన్యవాదముల నర్పించుచున్నారు.

ఇప్పటి కంతటికిని ప్రస్తుతము రాష్ట్రవిద్యాధికారియగు శ్రీ కృష్ణ సౌందర్యముగారి అవిద్యాయును భారత యుద్ధమున మోహనసిద్ధాంతముచే క్రుంగియున్న విజయుడను చిన్నదాసిని ప్రబోధించు భగవద్గీతలో బోధము గావించిన శ్రీ కృష్ణ భగవానుని పగిదియున సర్ స్వాతంత్రముగా నెంతయు ఉపాధ్యాయులను ఆశీర్వదింపక కోవేరము.

వెల్లని వెన్నెలరాత్రులు ప్రసాదించిన మక్కువతో ఆరోజికి మచ్చునున్న యుండవలసిన సంవత్సరము S. S. L.C. పరీక్షలో కొద్దిమార్కులలేమిచే తప్పినవారిని సెకండరీగ్రేడు తర్ఫీదుపొందుటకు (స్టైపెండ్సులేక) అనుమతి నిచ్చి ప్రస్తుతము స్టైపెండ్సుతో అట్టివారిని చేర్చుకొనగూడదను ఆజ్ఞను ప్రసాదించుటనుట ఎంతయు నిరుత్సాహకరము.

ఇదియునుగాక గుడ్డిలో మెల్లయన్నట్లు యితమును S. S. L. C పరీక్షలో దురదృష్టవశాత్తు తప్పి Higher Grade Shortened Course పొంది కృతార్థులై ప్రస్తుతము ఉపాధ్యాయులుగా పనిచేయుచున్న వారిని సెకండరీగ్రేడు స్టైపెండ్సుతో చేర్చుకొనరని చెప్పుట మూల పెందుడు పిలిచి తల గొరుగబోయనన్నట్లున్నది.

లోయరుగ్రేడు చదివి, యల్ టి. గ్రేడులో కృతార్థులైన వారుండ స్టైపెండ్సు యివ్వనున్న నెపమున మిక్కిలి అర్హులుగానున్న హైయరుగ్రేడు ఉపాధ్యాయుల ఆశాజనక జీవితముల గొడ్డలిపెట్టువలె ఆహుతి గావింపనున్నట్లున్నది.

యుద్ధానంతరము అమలులోనికి రానున్న సార్జెంటు కమిటీవారి మహోన్నత ఉపాధ్యాయ జీవితాశయములు చాలునిరిగిన కోడికి రోలే గతియనుకొని ఉపాధ్యాయవృత్తియే పరమాశయముగా గొన్న హైయరుకమువారికి అడి ఆశలైపోవుట ఎంతయు విషాదకరము.

మద్రాసు బడ్జెటు ప్రచురణ సందర్భములో మున్ముందు ప్రతి ప్రాథమిక పాఠశాలయు ఆరవ తరగతి కలిగి యుండుననియు తెలిపియున్నారు. సెకండరీ గ్రేడు ఉపాధ్యాయులసంఖ్య మిక్కుటముగా పెరిగిన గాని పైచెప్పిన మేరకు ప్రతి ప్రాథమికపాఠశాలయు ఆరవతరగతి కలిగియుండుటకు వలనుపడదు. లేనిపోని నిబంధనలుంచుటచేత ప్రస్తుత యుద్ధపరిస్థితులలో సెకండరీగ్రేడు ఉపాధ్యాయులసంఖ్య పెరుగుటకల్ల.

కావున దయామయులగు శ్రీ డైరెక్టరుగారు (S. S. L. C. Higher Trained) S. S. L. C. హైయ్యరు ట్రైన్డ్ ఉపాధ్యాయులకు (Shortened course) షార్టెండ్ కోర్సు నిచ్చి సెకండరీ గ్రేడు తర్ఫీదుపొందునట్లు అనుమతించుటయో, అట్లు వీలుగాని పక్షమున వారిని ప్రయివేటుగా చదువుకొని పబ్లిక పరీక్షకు హాజరగునట్లుగాని, అనుమతింపవలసినదని మిక్కిలి ప్రార్థించుచున్నాను.

యస్. బి. సంపత్కుమార్,
పామిడి 22-౪-44.

---

## కొండపల్లి

ది 18 3 1944 తేదిని కొండపల్లి కేంద్రోపాధ్యాయసంఘము సభ కృష్ణాజిల్లా డి. ఇ. ఓ గారగు శ్రీ V. రామచంద్రరావు B A. L. T. వారి యాజమాన్యమున జయప్రదముగ జరిగినది. డి. ఇ. ఓ గారికి స్వాగతపంచ రత్నములు చదివి వినిపించబడెను. తరువాత అర్ధగంటసేపు ఉపాధ్యాయులకు విద్యాబోధనలో వుండవలసిన విధానము. ఉపాధ్యాయులు స్వల్పవేతనములతో బహుకష్టములు బాగుగా వివరించి చెప్పిరి. వీరితోపాటు బెజవాడ హిందూ గంజీస్కూళ్ల S. D. I. గారైన శ్రీ B. సత్యనారాయణ B. A. L. T గారు బెజవాడ మహమ్మడన్ గంజీస్కూళ్ల D. I గారును నాటిసభకు హాజరై స్కూలు పురోభివృద్ధికి ఉపాధ్యాయుడు చేయవలసిన కృషిని వెల్లడిపరచి నాటి కార్యక్రమమును పూర్తిచేసిరి. సభకు సుమారు 40 మంది టీచర్లు హాజరైరి.

కొండపల్లి
22—4—44 }

దాసరి సుందరం.
సెక్రటరీ,

## కడపరేంజి

కడపరేంజి ఎలిమెంటరీస్కూల్ టీచర్స్ అసోసియేషను వారు **4 3 44** తేదీన యుద్ధనిధి సహాయార్థమై కడపజిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసరుగారి అధ్యక్షతక్రింద "సోమయాజి" యను నొక సాంఘిక నాటకమును సభారంజకముగ ప్రదర్శించిరి. శ్రీ M గోపాలస్వామి నాయుడు B. A. B. Ed కడపరేంజి స్కూల్సు సీనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారును, శ్రీ M. D వేంకటసుబ్బయ్య B. A B.Ed. జూనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారును, అరేంజరులుగానుండి శ్రద్ధతో పాటుపడిరి. యుద్ధనిధికి రు **335/-** వసూలయ్యెను.

బి. గోపాలయ్య
సెక్రటరి
ఎలిమెంటరీస్కూల్ టీచర్స్ అసోసియేషను

కడప
16—3—44

## కోయిలకుంట్ల (కర్నూలుజిల్లా)

మా రేంజి స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ గారగు శ్రీ యం. క్రిష్ణమాచార్యులు F. T. S. B A. B. E. D. గారు మా తాలూకా నుండి గిద్దలూరు రేంజికి బదిలీ గావించబడిరి. వారి స్థానమునకు శ్రీ డి. వెంకటస్వామిగారు M. A. B. E. D. గారు అరుదెంచిరి.

4 3-44 వ తేదీన జరిగిన సెంటరు క్లాసులో వీడ్కోలు, ఆహ్వాన, ప్రశంసాసభలు జరుపబడెను. అల్పాహారవిందు యొసంగబడెను. ఉపాధ్యాయ సోదరులందఱు ప్రేమపూరిత ఆశీస్సులతో శ్రీ యం. క్రిష్ణమాచార్యులవారికి వీడ్కోలు నొసంగిరి.

కోయిలకుంట్ల,
4—3—44.

కే. పె బాలాశింగ్,
కార్యదర్శి.



ది 19 2-44 శనివారం మధ్యాహ్నం కాకినాడ మసీదువీధి భారతీ విద్యాలయంలో కాకినాడ ఎయిడెడ్ గ్రూపు టీచర్ల సంఘసభతో బాటు సదరు సంఘ ప్రథమ వార్షికోత్సవము శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారి యాధిపత్యమున జరుపబడెను. తాలూకాలోని ఎయిడెడ్ పాఠశాల యాజమాన్యులును వచ్చిరి. **P. R. Collegiate School** లో ప్రధానోపాధ్యాయులుగా నుండిన శ్రీ C. V. అన్నాజీరావు గారు ఉపాధ్యాయుల విధులు- అడ్డంకులు అను శీర్షికపైనను, శ్రీ M థియాఫిలస్ గారు ఉపాధ్యాయ సంఘములపైనను, జిల్లా ఎయిడెడ్ పాఠశాలల ఉపాధ్యాయ సంఘ కార్యదర్శిగారగు శ్రీ A. నీలకంఠం గారు ఉపాధ్యాయుల యొక్కయు, పాఠశాల యాజమాన్యులయొక్కయు పరస్పర బాధ్యతలనుగూర్చియు వివరించిరి. శ్రీ రేంజి విద్యాధికులు యీ సభకు వచ్చి మాట్లాడిరి. తరువాత యీ క్రింది తీర్మానములు గావింపబడెను.

## తీర్మానములు.

1. సెలవాగ్రాంటు యిప్పించవలెననియును,
2 గ్రాంటు స్కేలు హెచ్చింపవలెననియును,
3. కరువుభత్యము శ్రీ లోకల్ బాడీ తాబేదారుల కిచ్చునట్లు యిప్పించవలెననియును,
4. ఆపుబడిన వాయిదా గ్రాంటు తరువాత వచ్చు వాయిదా గ్రాంటుతో యిప్పించవలసినదనియును,
5. ఉపాధ్యాయులకు 85% గ్రాంటు యిచ్చుటకు బదులుగా 100% యిచ్చుచు అధనముగా 15% యాజమాన్యన కిప్పించవలసినదనియును,
6 సం॥రము పొడుగున ఒక తరగతి శిక్షను చేయుబడి కావలసిన హాజరు చూపినను ఒక్క ప్రామోషను నెలలో 35 హాజరునకు తక్కువ వచ్చుటవలన ఒక ఉపాధ్యాయుని గ్రాంటు తగ్గించరాదనియును తీర్మానించుడమైనది.

తరువాత యీ సభ అల్పాహారవిందుతో ముగించబడెను.

కాకినాడ, (Sd.) సదా-శివుని చక్రపాణి,

19—2—44. కార్యదర్శి.

## మండపేట బాలుర కేంద్రోపాధ్యాయ సంఘము-వార్షికోత్సవము

పై వార్షికోత్సవము ది 11-3-1944 తేదీని శనివారం మధ్యాహ్నము శ్రీ కె. సూర్యనారాయణ, బి.ఏ., గారి అధిపత్యమున మండపేట బోర్డు బాలుర పాఠశాల భవనమున జరిగినది. సభకు రామచంద్రపురం రేంజిస్కూళ్ళ అడిషనల్ జూనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారగు శ్రీ పి. వి. చలపతిగారున్ను, పలువురు విద్యాభిమానులున్ను విచ్చేసిరి. అల్పాహారములొసంగబడినవి.

మండపేటబోర్డు మిడిల్‌స్కూలు హెడ్మాష్టరుగారగు శ్రీ యె. సత్యనారాయణరావు, బి. ఎ., బి. ఇ.డి., ప్రాథమికవిద్య దాని నిర్వచనము, ఉపాధ్యాయుని బాధ్యత అతని జీవితము, అనువిషయములను గూర్చి చక్కగ ఉపన్యసించిరి.

డాక్టరు గ్రీభాష్యం వెంకట్రావుగారిచే "మునిత్రయ"చరిత్రనుండియు శ్రీ "శివభారతము"నుండియు కావ్యపరనము గావింపబడెను.

మండపేట బోర్డు బాలుర పాఠశాల విద్యార్థులచే "విద్యాదానమును" ఏడిదబోర్డు బాలుర పాఠశాల విద్యార్థులచే "దశమగ్రహము" చిద్విలాసము" అను నాటకములను సదరు స్కూలు అసిస్టంటు టీచరు శ్రీ హెచ్. తిరుపతిరావుగారిచే "రామదాసు జైలుసీను" అతిరమ్యముగా ప్రదర్శింపబడెను. సభ జయప్రదముగాను అతివైభవముగాను ముగిసెను.

అవసరాల రంగారావు,

కార్యదర్శి.

## ఉపాధ్యాయసభ

నరసరావుపేట గరల్సు రేంజీ ఉపాధ్యాయ మహాసభ ఫస్ట్‌సర్కిల్ ఇన్‌స్పెక్ట్రెస్ శ్రీమతి యు. డెల్లి బి. ఏ. యల్. టి గారి యాజమాన్యమున 13-3-44 వ తేదీ మధ్యాహ్నము 4 గంటలనుండి, యు, యల్, సి. యమ్ గరల్సు హాయ్యర్ ఎలిమెంటరీ స్కూలులో జరిగెను. సభకు షుమారు 400 మంది ఉపాధ్యాయ సోదరసోదరీమణులు విచ్చేసిరి, అనేకమంది విద్యాశాఖాధికారులును, యుద్ధప్రచారకులును, సభకు విచ్చేసిరి మా సబ్ అసిష్టంటు ఇన్‌స్పెక్ట్రెస్ శ్రీమతి యం. సీతాలక్ష్మి బి. ఏ. యల్. టి గారు కూడ సభనలంకరించియుండిరి. యుపాధ్యాయులచేత స్వాగత పత్రము సమర్పింపబడెను. ఉపాధ్యాయుల విధులను గూర్చియు, ప్రభుత్వము వారికి మనను యుద్ధమున తోడ్పడవలసినవిధమును గూర్చియు, విపులముగ గంభీరోపన్యాస మొసంగిరి. వందనకత సమర్పణముతో సభనిరమింపబడెను.

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య

సెక్రెటరీ

సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితోసహా) Reg No M 3766

సంపుటము 30 సంచిక 11

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

ఫిబ్రవరి 1942



సంపాదకులు

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి ఏ,



వ్యవస్థాపకులు

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు

రామా అండ్ కో.,

హెడ్ ఆఫీసు — ఏలూరు,

బ్రాంచెస్ — మద్రాసు - గుంటూరు - రాజమండ్రి

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore

# విషయసూచిక

